

శ్రీ

# మహానందీశ్వర శతకము.

బ్ర॥ బండియాత్మకూరు రామశాస్త్రిగారి కుమారుడగు

బి. శివశాస్త్రిచే

రచియింపంబడి

పండితులచే పరిష్కరింపబడినదై

---

నంద్యాల గ్రామకాపురస్థుడగు, శివభక్తాగ్రేసరుడైన

రా॥ భద్రిశెట్టి నందప్పగారిచే

ప్రచురింపబడియె.

---

గుంటూరు ఆర్యవైశ్య ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.



# మహానందీశ్వర శతకము.

క॥ శ్రీరజితాచలవాసా
సారసభవనిర్జరాది సన్నుతపద నీ
రేరుహ కమలావరసుత
మారకననుఁ బ్రోవుమయ్యా మహానందీశా॥

క॥ దీనజనకల్పభూరుహ
దానవనాగేంద్ర సింహ ధరణీనాథా
శ్రీనిధినాకాధిప స
న్మానిత ననుఁగావుమయ్య మహానందీశా॥

క॥ జననివి జనకుఁడవీవె
తనరెడుచుట్టంబువీవ దాతవునీవే
ఘనప్రియమిత్రుఁడ నీవే
మనమలరఁగఁ గొల్జెదవ మహానందీశా॥

# మహానందీశ్వరశతకము.

క॥ కరుణాసాగర శంకర
ఘనసారప్రమదాధినాధ భువనాధిపతీ
దురితాంధకార భాస్కర
స్మరహరగాపాడుమయ్యా మహానందీశా॥ ౧౪

క॥ స్థావర జంగమరూపా
పావనభస్మాంచితాంగ పన్నగభూషా
పావకలోచనగిరి స
ద్మా వరదా శరణునీవె మహానందీశా॥ ౫

క॥ పెనుబలుకు కన్నకొఁడుల
గనిమిషము బవరంబునందుఁ మూర్ఖముగను మే
దిని ధర్మము స్థాపించిన
వనజపతీ దిక్కునీవ మహానందీశా॥ ౬

క॥ నమ్మినవారలనెల్లను
సమ్మతిఁగాపాడి సిరులసమకూర్చెదవం
చిమ్మహిఁదిక్కని నమ్మిన
మమ్ములఁ గాపాడుమయ్యా మహానందీశా॥

కం॥ హరయను వర్ణద్వితయము
గురుతరపాపములనెల్లఁ గూల్చును స్మరణన్
ధర నీనామ మహాత్మ్యము
మరిమరిఁ బొగడంగతరమె మహానందీశా॥ ౯

కం॥ చిక్కేము రక్కసుబాధల
దిక్కని మొరలిడెను సకలదివిజులనెల్లన్
గ్రక్కునబాధలనుండియు
మక్కువఁ గాపాడితీవ మహానందీశా॥ ౧౦

కం॥ గరళముబుట్టిన సంబుధి
సురులెల్లను భీతిఁజెంద సొంపుగవిషమున్
ధరియించి కంఠమందున
మరువక రక్షించితీవ మహానందీశా॥ ౧౧

కం॥ బాలుఁడు మార్కండేయుఁడు
కాలునిచేఁజిక్కి వేడ కడు వేగమునన్
గూలిచితివమునిని, బాలుని
మాలిమిఁ గాపాడితీవ మహానందీశా॥ ౧౨

కం॥ బాలేందుమౌళి శంకర
కాలాంతక వామదేవ కరుణాంభోధీ
శైలాత్మజేశ గళవిష
మాలాంచిత పుణ్యపురుష మహానందీశా॥ ౧౨

కం॥ వీతాశనులై తపమును
శీతాతపములకు నోర్చి జేసెడుముని సం
ఘాతములకుఁ గాన్పింపక
క్ష్మాతలమున వెలయు దేవ మహానందీశా॥ ౧౩

కం॥ వనజాసనాత్మజుం డిల
ఘనతరసుమశరము లేయఁ గడుకోపమునన్
గనవీక్షణాగ్ని చేతను
మనసిజుఁ బరిమార్చితీవ మహానందీశా॥ ౧౪

కం॥ తొమ్మిదిరూపులదాల్చియు
సమ్మతినవనందులందు సలుపుచువసతి
నిమ్మహిం బాసిలుచుందువు
మమ్ములఁ గృపఁ జూడువయ్య మహానందీశా॥ ౧౫

కం॥ మందులఁగాపాడను నవ
నందులయందొప్పుచుండు ననువునను మహా
నంది స్వతిలోఁడను జన
మందారక వెలుఁగుచుండు మహానందీశా॥ ౧౬

కం॥ గోపకులు మేపఁ గోవుల
నాపడవై కపిలగోవు పాల్దాగుచు నా
గోపకుల కంటఁబడకను
మాపతి వర్తించుచుండు మహానందీశా॥ ౧౭

కం॥ వినివృత్తాంతము నందుఁడు
నినుఁ జూడనువచ్చి దాఁగి చేర్వనపొదలో
గ్గనుఁగొని పాల్దాగెడునిను
మనమున సంతోషమందె మహానందీశా॥ ౧౮

కం॥ నినుఁజేరవచ్చుచుండఁ గఁ
గని నందుని గోవు వెఱచి ఖరఖురమున నీ
ఘనతరమగు శీర్షంబును
మనమలరఁగఁ ద్రొక్కెఁ గాదె మహానందీశా॥ ౧౯

కం॥ అటనుండి శ్వేతవాహుని
జటిలప్రహారంబు భాతి సర్వేశ్వరునీ
పటుశీర్షంబున సుషిరము
నటుమాయన్వెలయుచుండు మహానందీశా । ౨౦

కం॥ నిక్కఁగజాసురుసని లో
ద్రొక్కనఁ బరిమార్చి మాన్చి కాశ్యపిక్షోభము
ఝక్కని తచ్చర్మంబును
మక్కువనమరఁ దాల్చితీవ మహానందీశా॥ ౨౧

కం॥ కామహర కామదాయక
సోమాయుత వహ్నినేత్ర సోమార్కధరా
వేమారునిన్ను వేడెద
పాతక పాపములఁబాపు మహానందీశా॥ ౨౨

కం॥ ధ్యానస్నానంబులచే
మానక దురితములఁబాపు మరుదాపగను
స్నానకశిరమునఁ దాల్చిన
మానసపతివీవ జగతి మహానందీశా॥ ౨౩

క॥ కన్నప్పయనెడి భక్తుఁడు
కన్నులనర్పించి భక్తిఁగడు మోదముగన్
సన్నుతిఁజేయఁగ ముక్తిని
మన్నించియొఁజేసితివ మహానందీశా॥ ౨౮

క॥ మానకత్వార్భక్తుండై
సూనముల న్పూజసేయు సుందరగమనా
బాణునకు వేయి కరముల
మానితపద మొసఁగితివ మహానందీశా॥ ౨౯

క॥ వాపినిత్రవ్వఁచు భక్తుడు
పాపులకృత్యమున నందుఁబడఁగనుఁగనులన్
ఓపిక దాంచారికునకు
మాపత్తియివ్వంగలేదె మహానందీశా॥ ౩౦

క॥ ధనమును భవదాలయముకు
వనయము వ్యయపరుప భక్తినందకుజూడన్
తనరఁగఁ గడవలనంబిని
మనిపితి కైలాసమునకు మహానందీశా॥ ౩౧

కం॥ శ్వేతుఁడు రాజన్యోత్తము
డాతతభవభక్తియుక్తుఁ డంతకుచేతన్
భీతిలిచిక్కియు కీడెను
మాతరుణీప్రియుఁడనిన్ను మహానందీశా॥ ౩౨

కం॥ నాపరమభక్తుఁడాతఁడు
పాపము గొంపోకుఁడనుచుఁ బల్కఁగభవదా
లాపముల సరకుఁగొనక ను
మాపతి సనుచుండెజముఁడు మహానందీశా॥ ౩౩

కం॥ మనమున భీతినిఁజెందక
జనపతిని న్గొట్టుకొనుచు జముఁడరుగంగ
న్గనలియు నాతనిఁ గాల
న్మనుజేశ్వర తన్నితీవ మహానందీశా॥ ౩౪

కం॥ చరణాహతి మరణంబును
సరసిజపతి పుత్త్రుఁడొంద జగతినియమ్మ
త్కరుణాగసమున శమనుడు
మరలం జీవించెఁగాదె మహానందీశా॥ ౩౫

క॥ కమలాధినాథ విశిఖా
విమలాంతఃకరణ శిష్టవిల సచ్చేతో
కమలాంబుజాత నాధా
మమతన్నను బ్రోచుమయ్యా మహానందీశా॥ ౩౬

క॥ తరుణీవేషముఁ దాల్చిన
గరుడధ్వజు వెంటవారు కావనమునకున్
స్మరజిత రూపుడవైఁ సం
వరదుఢ నీవరిగితయ్యా మహానందీశా॥ ౩౭

క॥ మునికాంతలు మోహంబున
నినుఁజూచియు వదలిపతుల వేర్పడలిప్పన్
నినువెల్ల వేళలందును
మనసిజహార గొలువలేదె మహానందీశా॥ ౩౮

క॥ వారింపలేక కాంతల
వారుంగడు గుపితులగుచు పలుదండములన్
వారకమానులు గలిసియు
మారాంతక యడచిరయ్య మహానందీశా॥ ౩౯

కం॥ ధరఁదొ్రించి వైచిలింగము
సురులచ్చెరువంద మునులుఁ జూచుచునుండ
స్సరగన దృశ్యుఁడవైమను
స్మరహార ననుదెంచితీవ మహానందీశా॥ ౪౦

కం॥ వెఱచియు నుత్పాతములకు
వసుసన్నిధి దెలుఁపగాను వనికేగిరియు మఱి
స్వరలింగరూపధారుని
మతినిను బూజించిరయ్య మహానందీశా॥ ౪౧

కం॥ కనపడి దారుకవనమున
మునివర సంఘుంబుక్లల్ల ముదముననిన్ను
గ్గనసాధనమా సాంఖ్యము
మనుజపతీ దెల్పితీవ మహానందీశా॥ ౪౨

కం॥ నీయందుఁబుట్టుసర్వము
నీయందు లయంబునొందు నేర్పున లోకం
బీయందు వృద్ధినొందును
మాయంబా దరణఁబరపు మహానందీశా॥ ౪౩

కం॥ నీవల్లసర్వలోకము
లావిర్భావంబునొందు నఖిలాత్మ౹కుఁ
నీవాధారము పరమా
త్మానిను తలంచెదనునిన్ను మహానందీశా॥ ౪౪

కం॥ నీవే పురాణపురుషుఁడ
నీవేసర్వేశ్వరుండ వీవేసర్వం
బీవే తేజోరాసివి
మాహిమాప్రియసఖుండ మహానందీశా। ౪౫

కం॥ జనకాది యోగివరులకు
ననయముఁ గాన్పింపనట్టి యంతర్యామి
న్నినుఁగాంచి నందితనయుఁడు
మనమున ధ్యానించెనిన్ను మహానందీశా॥ ౪౬

కం॥ జ్ఞానంబునైనను న
జ్ఞానంబునైన నలుఁ పు నానాఘములుఁ
ధ్యానింపఁదొలఁగిపోవును
మానవపతి నిన్ను జనులు మహానందీశా ౪౭

కం॥ హరకాలానల రూపా
పరమేష్ఠీవేదవేద్య భవజలనిధి సం
తరణైక యోగ్యతరణీ
మరువక గాపాడుమయ్య మహానందీశా॥ ౪౮

కం॥ పదునాలుగు భువనంబులు
యుదరంబున నిల్పినట్టియున్నతరూపా
విదితముగ జీవులందును
మదనాంతక వెలుగుచుందు మహానందీశా॥ ౪౯

కం॥ పాయుటకు బ్రహ్మహత్యను
పాయంబైపరగ భువనవారమునందున్
పాయకభిక్షార్థంబై
మాయకుడా తిరిగితీవ మహానందీశా॥ ౫౦

కం॥ ఘర బ్రహ్మహత్యబాయను
వరశోణితధార భిక్షువనక్షేత్రుండా
దరమున నొసగానునీకు
స్మరలును బోకార్పుమయ్య మహానందీశా॥ ౫౧

కం॥ దారుణ విష్వక్సేనుని
భైరవరూపమున బార్చి పటువేగమునన్
ధారుణి యమనిలయుంబుకు
మారహరా బనిపి తీవ మహానందీశా॥ ౫౨

కం॥ వారిజ నాభుడు సెప్పగ
వారాణసి కేగి నీవు ప్రమథులతోడన్
దారుణ తపమును జేసితి
మారాంతక లోకనాధ మహానందీశా॥ ౫౩

కం॥ నరకముల బారద్రోలెదు
వరకాశీక్షేత్రమందు పరగుచు నీవే
నరులకు ముక్తి నివేద్య
స్మరిమరి దయచేయుచుందు మహానందీశా॥ ౫౪

కం॥ ముల్లోక శత్రుడైసుర
పల్లవపాణులను జెరలపాల్జేసినయా
ప్రల్లదుని నంధకాసుర
మల్లును బరిమార్చితీవ మహానందీశా ౫౫

కం॥ జనకావమానమునకై
తనరెడు సవ వాహ్ని వార్యతనువునుఁ
బాయకనలియఁ దక్షాధ్వరమును
మనుపాలను జేసి శివ మహానందీశా॥ ౫౬

కం॥ సనకాది మౌనివర్యుల
కనయము వేదాంతమహిమ నాదరమున నే
ర్పనరెడు వట మూలంబున
మనమున బోధించి శివ మహానందీశా॥ ౫౭

కం॥ త్రిదశులు వేడఁగ పీడా
ప్రదుఁడను తారకుని దైత్యుఁబరిమార్చుటకై
మదహరు బుట్టించి శివ మహానందీశా॥ ౫౮

కం॥ నటనముఁ జేయుచు ననయము
నటరాజను ఖ్యాతిచేత నను పుననవని
న్పటిమచి దంబరమందున
మటుమాయల్లో నెలుఁగుచుందువ మహానందీశా॥ ౫౯

కం॥ శ్రీకంఠదేవదేవా
నాకాధిప సన్నుతాంఘ్రి నందీశరధా
భూకామిని శవరధా
మాకింకను శరణునీవె మహానందీశా॥ ౬౦

కం॥ కరిచర్మాంబరధారీ
నరవర హృత్సరసి జాళిసౌశీళ్యహంసా
వరమృగ మండితహస్తా
మరి మరి నినువేడెదయ్యా మహానందీశా॥ ౬౧

కం॥ మెచ్చియుభుజబలముకు వి
ద్యచ్ఛాయనుత పాశుపతము ఫాల్గునకును ము
న్జచ్చెరనొసగితివీశా
మచ్చిక భువనాధినాథ మహానందీశా॥ ౬౨

కం॥ అగణిత సద్గుణనిలయా
నగవరసదనాదిదేవ నాగాభరణా
భగవంతుడ శ్రీమంతుడ
మగమానిక దేహశరణు మహానందీశా॥ ౬3

క॥ అజ్ఞాన తిమిరభాస్కర
సుజ్ఞానాంబోధిచంద్ర సురపతి గణబ్ర
హ్మజ్ఞాన ప్రదపరమా
త్మజ్ఞాని స్వాంత నిలయ మహానందీశా॥ ౬౪

క॥ జాయాపత్యసు హృద్వర
ఘాయాగ్రహ సహితమైన సంసారాబ్ధిన్
మాయామోహితుఁ జేయుచు
మాయామయు ముంచకయ్య మహానందీశా॥ ౬౫

క॥ నీపదసేవన్మర్త్యులు
పాపములన్బాసి జగతి పావనమగునీ
ప్రాపును బొందఁగ శక్తిను
మాపతిః భవ, కాంతురయ్య మహానందీశా॥ ౬౬

క॥ చిక్కియు భవరోగముచే
సృక్కెడు మానవుల నెల్ల శీఘ్రింబుగ నీ
చొక్కపు నామౌషధమతి
మక్కువ స్వస్థులనుఁజేయు మహానందీశా॥ ౬౭

కం॥ ఘోరభవాబ్ధిదరించియు
ధీరత నీస్మరణసౌఖ్యదీర్ఘికలందున్
ధారుణి మానీశ్వరులు ను
దారమణాముసు(గుచుందురి మహానందీశా॥ ౧౮

కం॥ పట్టుక తాపస వర్యులు
గట్టిగనీ చరణ లతలకఁ ఘోరంబౌ
యెట్టుల భవకూపంబుల
మట్టును దాటంగగలరు మహానందీశా ౧౯

కం॥ తనయునిఁ గోరి శిలాదుఁడు
ఘనతపమునుఁ జేయ మెచ్చి గడు మోదమునన్
తనయుని నందుని నతనికి
మనసిజసము నొసఁగి తీవ మహానందీశా॥ ౨౦

కం॥ అనలోష్ణరశ్మి హిమకర
వనపురుషా కాశధరణి పవనులం నీవుం
దనరెదునష్టాంగములై
మనుజేశ్వర వెలయుదు మందు మహానందీశా॥ ౨౧

కం॥ గిరిశైల నీలలోహిత
ధరణీ రథనిగమతురంగ దానవశౌరీ
హరిహరరూపాద్రైత్యా
మరసేవిత దిక్కునీవ మహానందీశా॥ ౨౨

కం॥ గిరిపతి పితృవనవాసా
హరిదంబర నిగమనిలయ అచ్యుతవరదా
కరివదన జనకభర్గా
మరుదాశన భూషితాంగ మహానందీశా॥ ౨౩

కం॥ మలపట్టి కోరక్కుందీర్పను
దలచియు కైరాతరూపు దాలిచి వేడ్కన్
బలరిపుతనయుని తోమును
మలసిన వీరుండ వీవ మహానందీశా॥ ౨౪

కం॥ వృషివ్యాఘ్రచర్మధారీ
సదయాత్మక కాలకాల సచ్చిద్రూపా
త్రిదశారినాథవరదా
మదహారననుం గాపుతయ్య మహానందీశా॥ ౨౫

కం॥ పరమల్లికార్జునుండని
ధరవర శ్రీశైలమందు దాక్షాయణితో
పరగుచునుందువు భక్తా
మరభూజ బ్రోచుమయ్యా మహానందీశా॥ ౭౬

కం॥ పురుషార్థసిద్ధినొసఁగ
న్పురుషులు సిద్ధేశుఁ డనుచు బొగడఁగ నిన్నీ
ధరమున నోంకారంబున
మరిమరి భాసిల్లుచుందు॥ మహానందీశా॥ ౭౭

కం॥ భవపాశంబుల ద్రుంచియు
భవహరనీగుణ సమూహవాగురులందుఁ
ధ్రువముగ వరానులు భుజగాం
గవరదుఁడా చిక్కిరయ్య మహానందీశా॥ ౭౮

కం॥ మలలందు గ్రామములందును
జలములగిరిగుహాలయందు సాధప్రాంతం
బులయందు వెలుఁగుచుందువు
కులిశహరా దిక్కునీవ మహానందీశా॥ ౭౯

క॥ ఏగతిముక్తి నిగాంచిరి
నీగుణగణ బద్ధులైననిర్మలహృదయుల్
యోగశ్ప్రకృతినిబొందిరు
మా గురునీస్మరణచేత మహానందీశా॥ ౨౦

క॥ శరకోటిభాను తేజా
యతులితగుణసంఘనిలయ యంబరకేశా
నుతిక్రౌంచ దారజనకా
నతకరిననుగావుమయ్య మహానందీశా॥ ౨౧

క॥ కరమునశిత శూలంబును
సిరమునసర్పాపధీశు ఛత్రంబుగగం
ధరమున విసమును దాల్చిన
మరుపాశనభూమప్రోవు మహానందీశా॥ ౨౨

క॥ వలపట్టిదాల్చితనువున
యిలజాహ్నవిశిరమునందు యిరువురకాపురుడుక్
కలహాము సేర్పన మాస్పేడు
మలినధ్వాంతార్కప్రోవు మహానందీశా॥ ౨౩

కం॥ యోగముచే నఖిలములగు
యాగంబులచేత జనులు యర్చింతురనిన్
యోగీశ్వరవర నగస
గ్మార్గంగాధరుడ బ్రోవు మహానందీశా॥ ౭౪

కం॥ జ్ఞానులకును ధ్యానులకును
మౌనులకును దెలియరాని మహిమాఢ్యుఁడవ
న్యానకృపాలోకనమున
మానక ననుఁ జూడుమయ్య మహానందీశా॥ ౭౫

కం॥ క్రతువులను తీర్థసేవల
వ్రతములదానముల సేయువలెనా గాకీ
పతినిన్ను భక్తితోడుత
మతిదలఁచినముక్తిగల్గు మహానందీశా॥ ౭౬

కం॥ సురనారీసంసేవిత
వరపాదాంబుజము శైలవరసుత నెపుడు
న్వరతనువునందుఁ దాల్చిన
వరశైవేశరణు నీవ మహానందీశా॥ ౭౭

కం॥ క్రీయని మండన మిశ్రుని
చారితబలగెల్చి వేద్య వాగ్వాదమునన్
ధారుని సన్యాసంబును
మరమణా నిల్పితివి మహానందీశా॥ ౮౮

కం॥ శ్రుతినిందఁ జేయుమానవ
వితతిన్బాధసిల్లధరణి విశ్వంభరున
న్మతముల స్థాపింపను స
న్మతమున జన్మించితీవ మహానందీశా॥ ౮౯

కం॥ గుణరహితు రూపరహితుని
ననయము చైతన్య రహితు నాగమయుతుల్
నినుదెల్పు గాంతుజగతి
న్మనమున కైలాసనిలయ మహానందీశా॥ ౯౦

కం॥ జననాలయ శూన్యుడవై
యనయము లోకములకెల్ల బాధారుడవై
జనకుడవై యేరీతిని
మనుజేశా వెలుగుచుండు మహానందీశా॥ ౯౧

# మహానందీశ్వర శతకము.

కం॥ శ్రుతిహీనుడవై యెట్టుల
సతతము వినుచుండు వెటుల సర్వంబును నే
గతివిగత లోచనుడవై
మతిశూన్యా గాంచుచుందు మహానందీశా॥ ౯౨

కం॥ చరణ విహీనుడవయ్యును
వేగమునగాపాడభక్తి సంఘము నెపుడున్
పరగుచునుందువు భక్తా
మరకల్ప ద్రుముడవీవు మహానందీశా॥ ౯౩

కం॥ దారిద్ర్య దావదహనా
దూరీకృత సకలదురిత దుర్భర తేజా
నారీమిశ్రితదేహా
మారాంతక బ్రోచుమయ్య మహానందీశా॥ ౯౪

కం॥ నీనామ శ్రవణంబున
నానారకవాసులెల్ల నతిరయమునను
న్నానాఘంబులఁ బాసియు
మానాథాముక్తులైరి మహానందీశా॥ ౯౫

కం॥ నందీశాదిగణంబులు
పొందుగనిను గేలఁ గొలువ భూధరమందా
నందంబున భక్తి వితతి
మందారక వెలుఁగుచుందు మహానందీశా॥ ౯౬

కం॥ కేవలుడవు రుద్రుండవు
దేవాసుర పూజితాంఘ్రి దివ్యమహిమను
ఖ్యాపింప దరమె జగతిను
మావనితా ప్రియుడ మాకు మహానందీశా॥ ౯౭

కం॥ శాశ్వత సదాశివపర
మేశ్వరనిను గొలుచుచుందు నెప్పుడు హృదివి
శ్వేశ్వరశంకరపరమా
నైశ్వర్యాలంకృతుండ మహానందీశా॥ ౯౮

కం॥ భైరవ రూపాశంభో
నారీనర రూపశివ నాగాభరణా
నారదమునివర సన్నుత
మారమణా బ్రోవుమయ్య మహానందీశా॥ ౯౯

కం॥ సురరిపు సాధులు సేసెడు
యురుతర తపములకు మెచ్చి యుర్వీతలము
న్వారివిగ వరముల నొసగిన
మరవైరి దాతవీవ మహానందీశా॥ ౧౦౦

కం॥ భారద్వాజస గోత్రుఁడ
ధారుణి శ్రీరామశాస్త్రి తనయుఁడ ద్విజుఁడఁ
పేరున శివాహ్వయుండను
మారమణా నన్ను బ్రోవు మహానందీశా॥ ౧౦౧

సంపూర్ణము.



# ఆర్యవైశ్య ముద్రాక్షరశాల,

## — గుంటూరు. —

మా ముద్రాక్షరశాలయందు హుండీపుస్తకములు, ప్రామిసరీనోట్లు, రశీదుపుస్తకములు, లెటరుహెడ్డుకవర్లు, కార్డులు, పలువిధములైన రంగులలో బహుమోదముగా ఇంగ్లీషు, తెలుగు, అరవభాషలలో సరసమైన ధరలకు వెంటనే అచ్చువేసి ఇవ్వబడును. అనేకవిధములైన రబ్బరు స్టాంపులు తయారుచేసి ఇవ్వబడును. మరియు శుభలేఖ కమలములు అనేకవిధములు పెక్కు రంగులలో అందముగా వేయబడును.

శనగపల్లి శ్రీరామమూర్తిగుప్త, మేనేజరు.

---

ఈపుస్తకము వ్రాయువారు—

బి. శివశాస్త్రి,

ఎస్. పి. జి. ట్రెయినింగుస్కూలు,

నంద్యాల, (ఆర్. యస్.)

